

# మాయదారి మోసగాడు

ఫిన్‌ల్యాండ్ జానపద కథ

మోలి, తెలుగు: కె. సురేష్



# మాయదారి మోసగాడు

ఫిన్‌ల్యాండ్ జానపద కథ

మోలి, తెలుగు: కె. సురేష్



అనగా అనగా ఒక ఊళ్లో రంగయ్య అని ఒక మాయలోడు ఉండేవాడు. అందరూ అతడిని మాయదారి రంగయ్య అనేవాళ్లు. మనుషులను పెర్రివాళ్లను చేస్తాడని రంగయ్యకి పేరు.

అదే ఊళ్లో మల్లయ్య అని ఉండేవాడు. రంగయ్య తనని మాయచెయ్యలేడని అతని అభిప్రాయం.



మల్లయ్య ఎప్పుడూ ఒక పెద్ద మేక మీద కూర్చుని తిరుగుతుండేవాడు. అందుకే అందరూ అతడిని మేకల మల్లయ్య అనేవాళ్లు. ఒక రోజు మేకల మల్లయ్యకి మాయదారి రంగయ్య కనిపించాడు. అప్పుడు అతడు ఒక చెట్టుకి ఆనుకుని నిలబడి ఉన్నాడు.

"రంగయ్య, నువ్వు మాయలోడివి అన్నది నిజమే," అన్నాడు మేకల మల్లయ్య. "కానీ, నువ్వు నన్ను మాయచెయ్యలేవు!"

"నిన్ను మాయచెయ్యగలను," రంగయ్య అన్నాడు, "కానీ నా మాయల సంచిని ఇంటి దగ్గర మరిచిపోయి వచ్చాను."



“అయితే వెళ్లి నీ మాయల సంచిని తొందరగా తీసుకుని రా. ఎవరు ఎవరిని పిచ్చివాడు చేస్తారో చూద్దాం!” అన్నాడు మేకల మల్లయ్య.

“ఇప్పుడు ఆ పని చెయ్యలేను,” రంగయ్య అన్నాడు, “ఈ చెట్టు పడిపోకుండా తన్నిపెట్టి నిలబడి ఉన్నాను. నేను వెళ్లిపోతే ఈ చెట్టు పడిపోతుంది.”

“నీ మాయల సంచి తెచ్చేదాకా ఈ చెట్టు పడిపోకుండా నేను నిలబడతాను,” అన్నాడు మేకల మల్లయ్య. మల్లయ్య చెట్టుకు ఆనుకుని నిలబడిన తరవాత రంగయ్య అతడి మేకని తీసుకుని ఇంటికి బయలుదేరాడు.



చెట్టుకు తన్నిపెట్టి నిలబడిన మేకల మల్లయ్య అలసిపోయాడు, కానీ రంగయ్య తన మాయల సంచితో తిరిగి రాలేదు.

చివరికి విసుగుపుట్టి మేకల మల్లయ్య అక్కడి నుంచి బయలుదేరాడు. అతడు పక్కకు తొలగినా చెట్టు పడిపోకపోవటం చూసి ఆశ్చర్యపోయాడు. “రంగయ్యా, నన్ను ఒకసారి మోసం చేశావు, కానీ మళ్లీ చెయ్యలేవు,” అనుకున్నాడు మేకల మల్లయ్య.

రంగయ్యని, తన మేకని వెతుక్కుంటూ అతడు ఊరివైపుకి పరిగెత్తాడు.



దారలో మేకల మల్లయ్యకి ఒక మడుగు కనిపించింది. రంగయ్య ఆ మడుగులోకి ఒక మేక తోలు విసిరేశాడు. అది మడుగు మధ్యలో తేలుతోంది. దానిని చూసిన మేకల మల్లయ్య ఇలా అనుకున్నాడు,

"నా మేక మడుగులో ఉన్నట్టు ఉంది!"

అతడు తన కోటు, బూట్లు తీసేసి మడుగులోకి దిగాడు.



మేకల మల్లయ్య మడుగు మధ్యకి చేరుకున్న తరవాత చెట్ల మధ్య దాక్కున్న మాయదారి రంగడు మేకతో బయటకు వచ్చాడు.

మేకల మల్లయ్య కోటు, బూట్లు తీసుకుని అతడు ఊరివైపుకి వెళ్లాడు.



తన కోటు, బూట్లు కూడా పోవటం చూసి మేకల మల్లయ్య అరిచాడు, “రంగయ్య నన్ను రెండుసార్లు మోసం చేశాడు, కానీ ఇంకోసారి చెయ్యలేడు.”

రంగయ్యని, తన మేక, కోటు, బూట్లని వెదుకుతూ ఊరివైపుకి వెళ్లాడు మేకల మల్లయ్య.



కొంచెం దూరం వెళ్లిన తరువాత అతడికి తన బూట్లలో ఒకటి కనపడింది. “ఒక బూటుతో ఏం ప్రయోజనం, రెండు బూట్లు ఉంటే బాగుండేది,” అనుకున్నాడు మేకల మల్లయ్య.

ఆ బూటుని అక్కడే వదిలేసి మళ్లీ నడవసాగాడు.



కొంత దూరం వెళ్లిన తరవాత మేకల మల్లయ్యకి రెండవ బూటు కనపడింది. దానిని తీసుకుని మొదటి బూటు కోసం వెనక్కి వెళ్లాడు. అయితే అది అక్కడ లేదు, మాయదారి రంగయ్య ఆపాటికే దానిని తీసేశాడు.

మేకల మల్లయ్య తన పిడికిలి బిగించి గట్టిగా అరిచాడు, "రంగయ్యా, నన్ను మూడుసార్లు మోసం చేశావు. కానీ ఇక నన్ను చచ్చినా మోసం చెయ్యలేవు."

ఆ తరవాత అతడు రంగయ్యని, తన మేక, కోటు, బూటుని వెతుక్కుంటూ ఊళ్లోకి వెళ్లాడు.



చివరికి మాయదారి రంగయ్య ఇంటికి మేకల మల్లయ్య చేరుకున్నాడు.

అతడు రావటం చూసిన రంగయ్య ఒక సంచిలోంచి కుందేలుని తీసి తన భార్యకి ఇచ్చాడు.

తరవాత పరిగెత్తుకుంటూ వెళ్లి మిద్దె గదిలో దాక్కున్నాడు.



చేతిలో కుందేలుతో రంగయ్య భార్య తలుపు తీసింది.

“రంగయ్య ఇంట్లో ఉన్నాడా?” మేకల మల్లయ్య అడిగాడు.

“లేడు,” రంగయ్య భార్య బదులిచ్చింది, “ఆయన అడవికి వెళ్లాడు. మీరు లోపలికి రండి. ఈ కుందేలుతో అతడికి కబురు పెడతాను.”

అలా అంటూ కుందేలును తీసుకుని లోపలికి వెళ్లింది.



మిద్దె గదిలో ఉన్న రంగయ్యకి కుందేలుని ఇచ్చి వెంటనే మేకల మల్లయ్య దగ్గరికి ఆమె తిరిగి వచ్చింది.



కొంచెం సేపటికి మాయదారి రంగయ్య కుందేలుతో ఇంటికి వచ్చాడు. "ఈ కుందేలు పిలవడంతో పరుగు, పరుగున వచ్చాను," రంగయ్య తన భార్యతో చెప్పాడు.

ఆ కుందేలు వంక మేకల మల్లయ్య ఆశ్చర్యంగా చూస్తున్నాడు.



"నీ దగ్గర అద్భుతమైన కుందేలు ఉంది," మేకల మల్లయ్య అన్నాడు. "దానిని నాకు అమ్ముతావా?"

"నీకు కావాలంటే 25 బంగారు నాణాలకు దీనిని కొనుక్కోవచ్చు," రంగయ్య అన్నాడు

మేకల మల్లయ్య ఆ డబ్బులు ఇచ్చాడు, మాయదారి రంగయ్య అతడికి కుందేలుని ఇచ్చాడు.

ఆ కుందేలుని తీసుకుని మేకల మల్లయ్య సంతోషంగా ఇంటికి వెళ్లాడు.



ఇంటికి వెళ్లిన తరవాత మేకల మల్లయ్య పాయసం కాయమని తన భార్యకి చెప్పాడు.

"కట్టెలు కొట్టటానికి నేను అడవికి వెళుతున్నాను. పాయసం తయారైన తరవాత కుందేలుని వదిలి నన్ను పిలవమని చెప్పు," అన్నాడు.



గొడ్డలి తీసుకుని మేకల మల్లయ్య అడవికి వెళ్లాడు. చాలాసేపు కట్టెలు కొట్టాడు. అతడు బాగా అలసిపోయాడు, ఇంకా కట్టెలు కొట్టే ఓపిక లేదు. అయినా అతడి కోసం కుందేలు రాలేదు.

చివరికి అతడే ఇంటికి తిరిగి వెళ్లాడు. "నన్ను పిలవటానికి ఆ కుందేలుని ఎందుకు పంపించలేదు?" అతడు భార్యను అడిగాడు.

"నిన్ను పిలుచుకుని రమ్మని కుందేలుని తలుపు బయట వదిలాను. అయితే అది నేరుగా మాయదారి రంగయ్య ఇంటివైపు పరిగెత్తింది," అతడి భార్య బదులిచ్చింది.



మేకల మల్లయ్య మళ్లీ పిడికిళ్లు ఝుళిపించి గట్టిగా అరిచాడు, “రంగయ్యా, నన్ను నాలుగుసార్లు మోసం చేశావు, కానీ ఈసారి మేసం చెయ్యలేవు.”

తన మేక, కోటు, బూటు, డబ్బులు రాబట్టుకోటానికి అతడు మాయదారి రంగయ్య దగ్గరకు బయలుదేరాడు.



మేకల మల్లయ్య తన ఇంటి వైపుకి రావటం చూసిన రంగయ్య కొన్ని వెండి నాణాలు తీసుకుని గర్రపుశాల దగ్గరకు పరిగెత్తాడు.

ఆ నాణాలను గుర్రం తోకలో దాచిపెట్టాడు.

తరవాత గుర్రానికి గోధుమలు తినిపించసాగాడు.



"రంగయ్య ఇంటి దగ్గర ఉన్నాడా?" అని అతడి భార్యని అడిగాడు  మేకల మల్లయ్య.

"గుర్రపుశాలలో ఉన్నాడు," అని రంగయ్య భార్య బదులిచ్చింది.

మేకల మల్లయ్య గుర్రపుశాలకి వెళ్లేసరికి మాయదారి రంగయ్య దానికి గోధుమలు తినిపిస్తున్నాడు.

"గుర్రానికి ఖరీదైన గోధుమలు తినిపిస్తున్నావేమిటి?"



"ఎందుకో ఇప్పుడే చూపిస్తాను," అన్నాడు రంగయ్య.

ఒక కర్రతో గుర్రాన్ని కొట్టాడు మాయదారి రంగయ్య. గుర్రం తన తోకను విదిలించటంతో వెండి నాణాలు కిందపడసాగాయి.

అలా వెండి నాణాలు పడుతుండటం చూసిన మేకల మల్లయ్యకి నోటివెంట మాటరాలేదు.



"నీ గుర్రం అద్భుతమైనది," అన్నాడు మేకల మల్లయ్య, "దానిని నాకు అమ్ముతావా?"

"దీని వెల 50 బంగారు నాణాలు," అన్నాడు రంగయ్య.

మేకల మల్లయ్య 50 బంగారు నాణాలు ఇవ్వటంతో అతడికి గుర్రాన్ని అప్పగించాడు మాయదారి రంగయ్య.

గుర్రం ఎక్కి మేకల మల్లయ్య తన ఇంటికి ప్రయాణమయ్యాడు.



ఇంటికి చేరుకున్న తరవాత, "చూడు, ఎంత అద్భుతమైన గుర్రాన్ని తెచ్చానో!" అన్నాడు మేకల మల్లయ్య.

అలా అంటూ గుర్రాన్ని కర్రతో కొట్టాడు. గుర్రం తన తోకను విదలించింది కానీ దాని నుంచి వెండి నాణాలు ఏమీ రాలి పడలేదు.

మేకల మల్లయ్య మరోసారి తన నెత్తిని కొట్టుకున్నాడు, "రంగయ్యా, నన్ను అయిదుసార్లు మోసం చేశావు. కానీ ఈసారి చచ్చినా మోసపోను."

తన మేక, కోటు, బూటు, డబ్బులు తీసుకోటానికి మళ్లీ మాయదారి రంగయ్య దగ్గరకు బయలుదేరాడు.



దారిలో మేకల మల్లయ్యకి అతని తమ్ముడు కనిపించాడు. తన దగ్గరనుంచి మాయదారి రంగయ్య మేకని, కోటుని, బూటుని, డబ్బుని మోసంచేసి ఎలా కాజేశాడో అతడికి చెప్పాడు మల్లయ్య.

"నా దగ్గర పెద్ద సంచి ఉంది. రంగయ్యని పట్టుకుని ఈ సంచిలో కట్టేసి, నదిలో పడేద్దాం. అప్పుడు రంగయ్య మనల్ని ఇక ఎన్నడూ మోసం చెయ్యలేడు," మేకల మల్లయ్య తమ్ముడు చెప్పాడు.



మేకల మల్లయ్య, అతడి తమ్ముడు అనుకున్నట్టుగానే రంగయ్యని పట్టుకుని సంచిలోకి నెట్టారు. సంచి మూతిని తాడుతో కట్టేసి దానిని నదిలో పడేశారు.

ఆ సంచి తేలుతూ నది ఒడ్డుకి రాసాగింది. దానిని తిరిగి నీటి మధ్యలోకి తోసెయ్యటానికి ఒక పొడవాటి కర్రకోసం మేకల మల్లయ్య, అతడి తమ్ముడు ఊళ్లోకి వెళ్లారు.



అయితే రంగయ్య జేబులో ఒక చాకు ఉంది.

ఆ చాకుతో సంచిని కోసేసి నీటిలోంచి బయటకు వచ్చాడు.

తరవాత ఆ సంచిలో కొంచెం గడ్డి, కొన్ని రాళ్లు పెట్టి కట్టేసి, తిరిగి నదిలో పడేశాడు.

అప్పుడు రంగయ్య ఒక చెట్టు వెనక దాక్కున్నాడు. మేకల మల్లయ్య అతడి తమ్ముడు పొడవాటి కర్రతో తిరిరి వచ్చి ఆ సంచిని నది మధ్యలోకి తోసేశారు.



తరవాత రెండు రోజులవరకు రంగయ్య ఊళ్లోకి రాలేదు.

పది ఆవులను కొనుక్కుని మూడవ రోజున వాటిని తోలుకుంటూ ఊళ్లోకి వచ్చాడు. అలా అతడు మేకల మల్లయ్య ఇంటి ముందు నుంచి వెళుతున్నాడు.

రంగయ్య, అతడి పది ఆవులను మేకల మల్లయ్య, అతడి తమ్ముడు గుడ్లు అప్పగించి చూడసాగారు.



“రంగయ్యా, ఈ ఆవులను ఎక్కడినుంచి తోలుకొస్తున్నావు?”

“నీళ్లలోపల నాకు ఈ ఆవులు దొరికాయి. ఇలాంటి ఆవులు అక్కడ వందలాదిగా ఉన్నాయి. కానీ నేను పది ఆవులను మాత్రమే తెచ్చుకోగలిగాను,” చెప్పాడు రంగయ్య.



“నన్ను కూడా సంచిలో కట్టేసి నదిలో పారెయ్యి,” అన్నాడు మేకల మల్లయ్య, “నాకు కూడా కొన్ని ఆవులు కావాలి.”

మేకల మల్లయ్యని రంగయ్య అలాగే సంచిలో కట్టేసి నదిలో పడేశాడు.

కొంచెం సేపటికి మేకల మల్లయ్య అరవటం మొదలు పెట్టాడు. అతని తమ్ముడితో రంగయ్య ఇలా అన్నాడు, “చూడు, అతడు ఆవులను పిలుస్తున్నాడు.”



అప్పుడు మేకల మల్లయ తమ్ముడు ఇలా అన్నాడు, "నన్ను కూడా సంచిలో కట్టేసి నదిలో పడెయ్యి. నేను కూడా అక్కడినుంచి కొన్ని ఆవులను తెచ్చుకుంటాను."

అతడిని కూడా సంచిలో కట్టేసి నీటిలో పడేశాడు రంగయ్య.

కొంచెం సేపటికి మేకల మల్లయ్య తమ్ముడు కూడా అరవటం మొదలుపెట్టాడు.



వాళ్లిద్దరినీ అలా కొంచెం సేపు అరవనిచ్చి పొడవాటి కర్ర సాయంతో ఆ సంచులను నీటి లోంచి బయకు లాగాడు. సంచులకు కట్టిన తాళ్లు తియ్యటంతో ఆ ఇద్దరు బయటకు వచ్చారు.

వాళ్లిద్దరినీ చూసి రంగయ్య పెద్దగా నవ్వాడు. "నిన్ను మొత్తం ఎన్నిసార్లు మోసం చేశానో చెప్పు," మేకల మల్లయని మాయదారి రంగయ్య అడిగాడు.

"నన్ను ఆరు సార్లు మోసం చేశావు. మళ్లీ నీ చేతుల్లో మోసపోవాలని లేదు."



దాంతో మేకల మల్లయ్యకి అతడి మేక, కోటు, బూటు తిరిగి ఇచ్చేశాడు రంగయ్య.

అయితే డబ్బులు మాత్రం అతడి దగ్గరే ఉంచుకున్నాడు. మాయదారి మోసగాడు అయిన తాను అతడిని మొత్తం ఆరుసార్లు మోసం చేశాడన్నది అతడు ఎప్పుడూ గుర్తుంచుకోటానికి అలా చేశాడు రంగయ్య.

